Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ నవంబరు నెల 7 వ తేది శుక్రవారం [నె 34 రు

## రష్యాకు సరకు పోవుటకు మూడు మార్గాలు.

### ఉత్తరపు రేవు పట్నంద్వారా చాల సరకు చేరుచున్నది.

రష్యాలో విపరీతమగు చలి ప్రారంభమైంది. ఉత్తరధ్రువమునకు రష్యా ఉత్తర భాగం చాల చేరువ. కావున భరింపరానంత చలికావుంటుంది. ఆ చలి జర్మనులకు అలవాటు లేదు. కావున ఇపుడు రష్యాపై యుద్ధానికి జర్మనులు క్రొత్త సేనలను విశేషంగా పంపుచున్నా, విశేషప్రాంతం ఆక్రమించినా, రష్యా నిరోధించ గల్గును. దాడివచ్చిన శత్రువుల కష్టాలు ఎక్కువగును. అయినా, మాస్కో ప్రాంతములందును, దక్షిణాన డానెట్సు నదీతీరమునందును వున్న పరిశ్రమలన్ని శత్రువుల చర్యలచే నాశనమైతే రష్యనులకు చాల నష్టం కలుగును. ఆ నష్టం ఇంగ్లాండు-అమెరికాల నుండివచ్చు సామగ్రియే పూడ్చగలదు. వచ్చే వసంతకాలం లోగా రష్యను సేనలు తిరిగి క్రొత్త ఆయుధాలు సంపాదించి తయారగుటకు యీ అమెరికా-ఇంగ్లాండుల సహాయమే చాల అవసరం. రష్యనులు యిపుడున్న రక్షణశ్రేణికి యింకా తూర్పునకు డాను-వాల్గానదులవరకు పోయి రక్షణలేర్పాటు చేసుకొన్నప్పటికీ, దానికి తూర్పున యున్న యుద్ధపరికరాల కర్మాగారములను, మందుపదార్థములను వృద్ధి పొందించుకొని ఒక ఏడాదిలోగా తిరిగి తమ సైన్యాని ప్రథమ తరగతి సేనగాచేయగలరు. ఆయుధసామగ్రి పూర్తిగ తయారుచేసుకోగలరు. కాని ఏడాదివరకు తయారు కాకపోతే ఎలాగ ? ఆరు నెలలలో సైన్యం తయారు అయి తీరవలెను. రష్యా క్రొత్త సేనను తిరిగి ఆరు నెలలలోగా తయారుచేయడానికి కావలసిన సహాయమంతా యివ్వడానికి బ్రిటిషు సామ్రాజ్యము అమెరికా ప్రభుత్వము పూనుకొన్నవి.

ఇంగ్లాండు-అమెరికాలు పంపేవస్తువులు అందడానికి రష్యాకు మార్గాలు సరిచేసుకోవాలి. రష్యా దేశానికి బయటనుండి సరకురావడానికి మూడు ముఖ్యమార్గాలు ఉన్నాయి. ఇండయాలోని బెలూచిస్తానునుండి, పెర్షియను గల్ఫ ఇరాను (పెర్షియా) ల మీదుగా రష్యా దక్షిణ భాగమునందున్న కాకసను లేక కాస్పియను సముద్రంవరకు ఒక త్రోవ గలదు. రెండోది, ఉత్తర అమెరికాకు పడమరనున్న పసిఫికు సముద్రమునుండి ఆసియా తూర్పు తీరమున రష్యా రేవు స్థలమగు వ్లాడివాస్టాకు వచ్చు సరకు సైబేరియామీదుగనున్న పెద్ద రైలు మార్గమున మాస్కో వరకు చేరగలదు. మూడో మార్గం, అమెరికా తూర్పు తీరమున అట్లాంటిక్ సముద్రము రేవగు బోస్టనునుండిగాని, యితర అట్లాంటిక్ సముద్ర తీరపు రేవులనుండిగాని స్టీమరులలో వచ్చు సరకు రష్యా ఉత్తర తీరపు రేవగు ఆర్చేంజలులో దిగవచ్చును.

### ఇరాను మార్గం.

ఇరానులో రోడ్లు క్రొత్తవి వేస్తున్నారు. ఇరానులోని రైలు మార్గము దినమునకు 3,000 టన్నుల సరకు రవానా చేయగలదు. 868 మైళ్ళ పొడవున్నది; దక్షిణమున పెర్షియను గల్ఫు తీరాన బందరుషాపూరు రేవునుండి, ఉత్తరమున కాస్పియను సముద్ర తీరాన బందరుషా వరకు ఉంది. ఆ రైలు మార్గముపైనే ఉన్న ఇరాను ముఖ్య పట్నమగు టెహరానునుండి, వాయవ్య దిక్కున రష్యా సరిహద్దుచేరువగవున్న మైబిజువరకు ఒక బ్రాంచి రైలు మార్గం ఉంది ; టెహరానునుండి ఈశాన్య దిక్కున మేషదు వరకు యింకో రైలు మార్గం వేస్తున్నారు. ఇది చివరకు అఫ్గానిస్తానం సరిహద్దు చేరువన రష్యాలోనున్న కస్కు స్టేషనుతో చేర్చబడును. ఇండియాలో సరిహద్దు రాష్ట్రమునందున్న క్వెట్టానుండి రష్యాకు మెట్టమార్గం కూడ అతివడిగ బాగు చేయబడుచున్నది. కరాచీ రేవునుండియు, ఇండియాలో యితర ఉత్పత్తి స్థానములనుండియు సరుకులు కరాచి-క్వెట్టా రైలు మార్గం మీదుగా రష్యాకు యికముందు పోగలవు. ఇరానులో రైలు మార్గములను దిట్టం చేయడానికి బ్రిటిషు ఇంజనీరులు పని చేస్తున్నారు. రైలు పెట్టెలు ఎన్నో ఇరానుకు ఇంగ్లాండునుండి పంపబడుతున్నాయి. ఇరాను మీదుగా తమ దేశం సరుకుకూడ రవానాచేయు ఏర్పాటులు సరిజూచుటకు అమెరికా నిపుణులుకూడ ఇరాను వచ్చియున్నారు.

### వ్లాడివాస్టాకు మార్గం.

ఏషియా తూర్పున పసిఫికు సముద్రమునందున్న అమెరికా ఫిలిప్పైను దీవులునుండి, డచ్చి తూర్పు దీవులనుండి అమెరికా నుండి కూడా సరకు వ్లాడివాస్టాకు రేవునకు అపుడే పోతున్నది. అటనుండి సైబేరియాలో నున్న ట్రాన్సు సైబేరియా రైల్వే మీదుగ రష్యాలో యుద్ధరంగమునకు యీ సప్లైలు చేరగలవు. ఈ మార్గం అమెరికా-ఇంగ్లాండులు ఉపయోగించరాదని జపాను బెదిరించుచున్నది. వ్లాడివాస్టాకు రేవు జపాను తీరానికి ఎదురుగ, అతి చేరువగావుంది. కాని జపాను అటులు సాగనివ్వమని, యిపుడు జపాను చెప్పేదంతా వట్టి బుకాయింపని రష్యా మంత్రి ప్రకటించెను.

### ఆర్చేంజెలు మార్గం.

ఏమయితే నేమి, అమెరికానుండి రష్యాకు వస్తున్న సామానులన్ని ప్రస్తుతం ఉత్తరతీరమందున్న ఆర్చేంజలు రేవునకే వస్తున్నవి. ఎందుకంటే యీ మార్గం అమెరికా నుండి దగ్గరమార్గం. రష్యాకు పంపబడుచున్న ఆయుధ సామగ్రులు విమానాలు యిత్యాదిసరకు తయారగు స్థలములన్ని అమెరికాదేశంయొక్క తూర్పు తీరానికే దగ్గరగ ఉన్నాయి. అందుచే అట్లాంటికు సముద్రమార్గమే రష్యాకు దగ్గర. పశిఫికుసముద్రమార్గం ఇంతకన్న దూరం. రెండు సముద్ర మార్గాలూ సుమారు 5,000 మైళ్ళే ఉన్నా, అమెరికాలో కర్మాగారాలనుండి రేవువరకు నేలను రవానాకావలసిన దూరమున్ను, వ్లాడివాస్టాకునుండి రష్యాలో సైబేరియా మీదుగ యుద్ధరంగాలవరకు గలదూరమున్ను చాలఎక్కువ. అందుచే అమెరికా సరకు ఆర్చేంజలు రేవుగుండా వచ్చుటే లాభకరం. చలికాలంలో మంచు దిట్టంగాపడి గడ్డకట్టి ఆర్చేంజలు చుట్టుపట్ల సముద్రంలో స్టీమరులు ప్రయాణం చేయ

డానికి వీలులేనపుడు, వ్లాడివాస్టాకుమార్గం ఉపయోగింపబడుతుందేమో కాని అంతవరకు ఆర్చేంజలు మార్గమే సులభం. అపుడైనా, రష్యాప్రభుత్వంవారికి మంచును బద్దలుకొట్టే స్టీమరులు మూడు క్రొత్తవి ఉన్నాయి. ఆర్చేంజలు రేవులో నవంబరునుండి మే మాసంవరకు నీరు ఘనీభవించి ఉంటుంది. ఈ మంచును ఆ మూడు స్టీమరులు భేదించగలవు. చలికాలంలోకూడ యీ మార్గం ఉపయోగించవచ్చునని రష్యాప్రభుత్వానికి నమ్మకంగలదు. అంతేకాక, అట్లాంటికు సముద్రమార్గంలో ప్రయాణంచేయు స్టీమరులకు రక్షణ యెక్కువగవుంది; మార్గం అలవాటయిపోయింది.

ఈ కారణాలచేత ఆర్చేంజలు మార్గం యితర మార్గాలకన్న ఎక్కువగ ఉపయోగింపబడుతూవుంటే, జపాను తాను బెదిరించినందున వ్లాడివాస్టాకు మార్గమును అమెరికనులు విడచిరని గొప్పలు చెప్పుకుంటున్నది. ఆర్చేంజలు నుండి నదీమార్గాలద్వారా మాస్కోకు యితర చోట్లకు సరకును సులభంగా రవానా చేయవచ్చునని, యీ మార్గమే వాడవలెనని నెలరోజులక్రిందట, జపాను బెదరించకముందే నిర్ణయించబడింది. పశిఫికు సముద్రములోని ఫిలిప్పైను దీవులు, తూర్పు డచ్చి దీవులు ఆస్ట్రేలియాలనుండికూడ ముడిపదార్థములు ఆర్కిటికు సముద్రంగుండా ఆర్చేంజలు రేవునకు అపుడే చేరినవి. ఆ సముద్రంలో మంచుకొండలను రష్యానౌకలు సులభంగా భేదించుచున్నవని, యీ సరకు గొంపోవుచున్న స్టీమరుల కెపనులు చెప్పిరి. ఈ మార్గం 1934 వ సంవత్సరములోనే కనిపెట్టబడింది. చలికాలంలోకూడా వాడుకలోవుంది.

బ్రిటిషు సరకు స్టీమరులుగూడ ఆర్చేంజలు రేవునకు యిటీవల చేరెనని, అందలిసరకు అతివడిగా అచ్చటనుండి యుద్ధరంగాలకు పంపబడిందని, జర్మనీకి స్నేహంగానున్న ఫిన్లండునుండి వార్తలు వచ్చెయి. కనుక రష్యాకు అన్నివిధములగు సహాయం చేస్తామని మాస్కోలో జరిగిన మూడురాజ్యాల సభయందు బ్రిటిషు, అమెరికా ప్రభుత్వ ప్రతినిధులుచేసిన వాగ్దానం ప్రకారం సరకు సప్లైలు విరామంలేకుండా యీ మార్గాల ద్వారా పంపబడతాయనుటకు ఎట్టిసందేహం లేదు.

---

# ఇండియాయొక్క లోహసంపద

## ఆయుధాలు మందుగుండు తయారుచేయుటకు పలసిన ముడిపదార్థములన్నియు ఉన్నాయి.

గత ఏడేండ్లలో ఇండియాలోని లోహముల ఉత్పత్తి చాల యెక్కువగ పెరిగింది. 1938 వ సంవత్సరంలో యీ లోహాల విలువ రూ. 34,21,87,929 వరకు పెరిగింది. ఈ లోహాలలో ముఖ్యమయినవి బొగ్గు, ఇనుము, పెట్రోలు. ఇవి యెక్కువగవుంటే పరిశ్రమలు బాగా అభివృద్ధిచెందడానికి అవకాశం వుంటుంది. వీటికి తోడుగ ఇండ్లు కట్టుకోనేందుకు కావలసిన రాళ్లు, ఇటుకలు, గట్టిమట్టి, సిమెంటు, సున్నం, పెంకులు, కుండసామానులు, రోడుమెట్లింకి మున్నగునవి కూడా ఇండియాలో చాల యెక్కువగ ఉన్నాయి. మాంగనీసు, అభ్రకంకూడ రూ 10 లక్షల విలువకుపైగా ఉత్పత్తియై ఎగుమతి చేయబడుచున్నవి. బంగారం గనులు నాలుగు మైసూరు సంస్థానమునందు కోలారువద్ద గలవు. ఉప్పు ఇండియా ప్రభుత్వంవారిచేతనే తయారు చేయబడుచున్నది. వివిధపరిశ్రమలకు పనికివచ్చే యితర లోహముల ఉత్పత్తికూడ గత ఏడేండ్లలో చాల ఎక్కువయినది. అవేవన:—ఇలుమెనైటు, క్రోమైటు, మాగ్నసైటు, జిప్సము, బాక్సైటు, గ్రాఫైటు అనునవి. ఇవన్ని ఇంగ్లీషు పేర్లు. ఇవి విదేశాలకు ఎగుమతి చేయబడుచున్నవి.

లోహములన్నింటిలో యుద్ధపరికరాలకు ఎక్కువగ ఉపయోగపడేది ఇనుము, ఉక్కు. క్రీస్తుపుట్టకముందు, అంటే 1900 సంవత్సరాలకు పూర్వమే ఇండియానుండి ఇనుము మధ్యధరా సముద్రప్రాంతములకు ఎగుమతి చేయబడుచుండినట్లు చరిత్ర తెల్పుచున్నది. ఇంతలో పాశ్చాత్యదేశముల ఆధునిక పద్ధతుల పోటీవలన ఇండియా గ్రామములందు తయారుచేయబడు ఉక్కునకు గిరాకి తగ్గిపోయింది. 1830 వ సం॥నుండి ఇండియాలోని ఇనుము గనులలో విశేషంగా పనిచేయించి లాభం పొందుట ప్రారంభమయింది. ఇప్పుడు సామ్రాజ్యమంతటిలో బొగ్గు, ముడి ఇనుము ఉత్పత్తిచేయు దేశాలలో ఇండియా రెండవ స్థానంలోవుంది. ప్రపంచంలో తయారయే మాంగనీసులో మూడోవంతు, అభ్రకంలో నాల్గింట మూడువంతులు ఇండియాలో తయారవుతున్నది. ఇపుడు అనేక లోహాలు ఇండియాలో త్రవ్వి తీయబడుచున్నను, భూగర్భంలో ఉన్న సరకంతటిలో బహు స్వల్పమే పైకి తీయగలుగుచున్నారు. ఇంకా బండ్లకు వ్యాపారానికి అందుబడిలో లేని మారుమూలలందు యీ లోహసంపద అంటుబడకుండా భూమిలోనే ఇమిడియున్నది.

### బొగ్గు.

1938 వ సం॥న ఇండియాలో రూ 10,64 లక్షల విలువగల రాక్షసి బొగ్గు తయారయింది. ఏటేట ఇండియానుండి యీ బొగ్గు ఎగుమతి ఎక్కువగుచున్నది. బీహారు రాష్ట్రమునందు ఎక్కువగను, బెంగాలు, మధ్యరాష్ట్రములు, తూర్పు సంస్థానములు, హైదరాబాదు సంస్థానములందును, బెలూచిస్థానము, ఒరిస్సా, పంజాబు, రాజపుటానాలందు కొద్దిగను బొగ్గు తయారగుచున్నది. ఇపుడు త్రవ్వి తీయబడుచున్న గనులుకాక, అస్సాం, మధ్యరాష్ట్రములు, బీరారులందు యింకా విశేషంగా బొగ్గున్నదని శాస్త్రజ్ఞులు పరిశోధించి తెలిపిరి.

### ఇనుము.

ఇండియాలో ఇనుము పరిశ్రమ అతివడిగా వృద్ధిపొందింది. ముడి ఇనుము మంచిదైతేనేగాని పరిశ్రమలందు మంచి ఇనుము వస్తువులు తయారుకావు. బీహారులో సింగభూమి జిల్లాయందును చేరువనున్న తూర్పు సంస్థానములందును 30,000 లక్షల టన్నుల ముడి యినుము త్రవ్వి తీస్తే అందులో 100 కి 60 వంతే మంచి ఇనుము తయారయింది. బస్తరు సంస్థానంలో 7,240 లక్షలటన్నులు మధ్యరాష్ట్రములలో చాందా, ద్రుగు జిల్లాలందు 25 లక్షల టన్నుల ముడి ఇనుము తయారవుతున్నది. సాలీనా ఇండియా మొత్తంపై 30 లక్షల టన్నుల ముడి ఇనుము తయారుచేయబడుచున్నది. ఇందెక్కువభాగం సింగభూమిలోదే. మైసూరు సంస్థానమునందు సాలీనా 35,000 టన్నులు ఉత్పత్తియగుచున్నది. అదివరకు ఇదంతా ఇండియాలోనే కరిగించబడుతూవుండేది. కాని 1938 లో ఎగుమతులు ప్రారంభమయినాయి. జపాను సాలీనా 10 లక్షల టన్నులు ఇండియానుండి తీసుకుంటున్నది. ఇంగ్లాండుకూడా ఇండియానుండి దుక్క యినుము కొంటున్నది. దుక్క ఇనుము ఇండియాలో 1939-40 వ సం॥నందు 1,837,600 టన్నులు ఉత్పత్తి అయింది.

### మాంగనీసు.

ఈ లోహం ఇనుము ఉక్కుపరిశ్రమలందు ఉపయోగింపబడును. కావున పరిశ్రమల గిరాకినిబట్టి దీని ఉత్పత్తిగూడ హెచ్చుతు తగ్గుతూవుంటుంది. దీనిఉత్పత్తియందు ఇండియా

రష్యాతో పోటీచేసి, అపుడపుడు రష్యాను మించిపోవుచుండును. ఇది ఎత్తుగ కొండలవలె ఏర్పడియుండును. కావున పగులగొట్టి తీయుటకు సులభంగావుండును. కాని సముద్ర తీరానికి చాలదూరంలో యీ కొండ లుండటం రవానాకు కొంచెం కష్టంగావుంటుంది. మధ్యరాష్ట్రములలో బాలఘాటు, నాగపూరు, చాంద్రా జిల్లాలందు, విశాఖపట్నం చేరువ సాందూరు సంస్థానమునందు, బొంబాయి రాష్ట్రంలో పాంచి మహలునందు, బీహారులో సింగపూరు జిల్లాయందు కొన్ని సంస్థానములందు మాంగనీసు లభించును.

ఇంగ్లాండు, జపాను, అమెరికా, ఫ్రాంసులు యీ లోహాన్ని ఇండియానుండి తెప్పించుకుంటున్నాయి. కొంత మనదేశంలో ఇనుముపరిశ్రమలందే వినియోగింపబడుతున్నది. 1938 లో 967,929 టన్నులు రూ 388 లక్షలు విలువగలది ఉత్పత్తి అయింది. ఇది ప్రపంచమంతటి ఉత్పత్తిలో మూడోవంతు.

## అభ్రకం.

ప్రపంచం ఉత్పత్తిలో ముప్పాతువంతు ఇండియాలో దొరుకుచున్నది. ఇందు నూటికి 80 వంతు బీహారులోను, మిగిలినది నెల్లూరు జిల్లాలోను తయారగును. రాజపుటానా, తిరువాంకూరులందుకూడా కొద్దిగ దొరుకును. ఇంగ్లాండు ఎక్కువగను, అమెరికా-జర్మనీలు తక్కువగను యీ లోహాన్ని ఇండియానుండి కొంటూవుంటాయి. పెద్దపెద్ద దిమ్మలుగా యిది త్రవ్వి తీయబడును. పొరపొరలుగా దాన్ని చీల్చి సన్నని అద్దపురేకులవలె తయారుచేయుటయందు బీహారులోని నేర్పరులగు స్త్రీపనివారున్నారు. కావున విదేశాలనుండికూడా యీపనికై అభ్రకం దిమ్మలు ఇండియాకు పంపబడుతూవుంటాయి. 1938 లో రూ 42 లక్షల విలువగల అభ్రకం ఇండియాలో తయారయింది.

## పెట్రోల్.

మోటారులు నడుపుటకు పనికివచ్చు పెట్రోలు, కిరసనాయిలు ఇండియాకన్న బర్మాలో ఎక్కువ ఉత్పత్తి అవుతున్నవి. కాని ఇండియాలోగూడ దీని యుత్పత్తి ఎక్కువగుచున్నది. అస్సాములో డిగ్బాయియందు 660 లక్షల గాలనులు, పంజాబులో అటకునందు 210 లక్షల గాలను 1938 సం॥లో తయారయినవి. ఇదికాక ఇతరదేశాల నుండి పెట్రోలు ఇండియా తెప్పించుకొంటున్నది.

## రాగి.

రాగి కూడా బీహారులో సింగపూరు జిల్లాయందే ఎక్కువగ ఉత్పత్తియగుచున్నది. ఇతర చోట్ల ఉన్నదికాని లాభసాటి వ్యాపారం జరుగలేదు. సాలీనా 6,000 టన్నుల శుద్ధమయిన రాగి తయారవుతున్నది. మైసూరులో కొద్దిగ రాగి దొరికినట్లు 1938 లో తెలిసెను.

## ఇతర లోహాలు.

పైన చెప్పిన ముడిపదార్థములు కాక పరిశ్రమలకు పనికివచ్చు యితర చిల్లర లోహాలుచాల ఇండియాలో దొరుకుతున్నాయి, కాని ఎక్కువ సరకు లభించుటలేదు. బాక్సైటు అను లోహంనుండి అల్యుమినియం తయారుచేయుదురు. అల్యుమినియం విమానాలు కట్టుటకు పనికివచ్చును. ఇది 1938 లో 4,634 టన్నులు త్రవ్వి తీయబడింది. కాని ఇందులోనుండి అల్యుమినియం తయారుచేయు పరిశ్రామిక సాధనం ఇండియాలో లేనందున యిదంతా విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నది.

గ్యాసుదీపాల వొత్తులు తయారుచేయుట కుపయోగపడు మోనాజైటు అనులోహము, తెలుపురంగు తయారుచేయుట కుపయోగపడు ఇలుమెనైటు, టంకం పనికి పనికివచ్చు జిర్కాను అనులోహాలు కూడ ఎక్కువగ ఇండియాలో దొరకుతున్నాయి. మోనాజైటు ఉత్పత్తి అతివడిగా పెరిగింది. ఇది తుపాకి తోటాలు చేయుటకు, రంజికాలకు సర్చిలైటులకు పనికివచ్చును. ఈ లోహాలు కన్యాకుమారి అగ్రంవద్ద సముద్ర తీరముగ ఇసుకలో దొరకుచున్నవి. యుద్ధ పరిశ్రమలకు బాగా ఉపయోగబడుచున్నవి. 1922 లో 400 టన్నులు తయారయ్యే ఇలుమైటు 1938 లో 1,81,047 టన్నులవరకు పెరిగింది. అన్ని దేశాలకన్న ఎక్కువగా యీ దేశంలోనే యీ లోహం లభిస్తున్నది.

ఉక్కు పరిశ్రమలో ఉపయోగింపబడు క్రోమైటు బీహారు, బొంబాయి, మైసూరు, బెలూచిస్థానములందు లభిస్తున్నది. అందుకే పనికివచ్చు మగ్నసైటు లోహం సేలంలోను, మైసూరులోనుగలదు. సిమెంటు, ప్లాస్టరు తయారుచేయుటకును, రంగులు తయారుచేయుటకును ఉపయోగపడు జిప్సము అనుకట్టి మట్టివంటి లోహం తిరుచునాపల్లిలోను, పంజాబు, నాగపూరు, బికనీరుయున్నగు చోట్లను లభించుచున్నది.. తగరం, సీసం, రేకుకూడ కొద్దిగ ఇండియాలో లభించును.

ఈ లోహాలన్ని త్రవ్వితీయించి ఎగుమతిచేసే పరిశ్రమలు యిటీవలనే ప్రారంభమయినవి. అందుచేతనూ, ఇవి విశేషంగా వాడబడే యూరోపు అమెరికా మార్కెటులకు ఇండియా చాల దూరంగావుండుటచేతను, యీ లోహపు గనుల పరిశ్రమ వెనుకా ముందూ అవుతూవుండెను. తూర్పు దేశాలలో యీ లోహాలకు గిరాకి హెచ్చినచో ఇండియా దేశానిక్కి మంచి లాభముండును. జాపానుకూడ పడమటి దేశాలకు దూరంగావున్నదగుటచే, యిటీవల యీ లోహాలను ఇండియానుండి ఎక్కువగా కొంటున్నది. ఇపుడు జాపాను పరిశ్రమలు ఎక్కువగ ఇండియా ముడి పదార్థములపై ఆధారపడియున్నవి.

రద్దు ఇనుము, ప్రాత ఇనుముకూడా ఇండియాలో విశేషంగా లభించుచున్నది. 66,000 టన్నులు ఎగుమతియగుచున్నది. ఇవి మందుగుండు తయారుచేయుటకు ఎక్కువగ ఉపయోగపడును.

---

# స్టీమరు ప్రయాణాలకు రక్షణ.

## "కాన్వాయి" ప్రయాణం పద్ధతి.

యుద్ధసమయంలో సముద్రప్రయాణం చాల కష్టం. శత్రువుల యుద్ధ నౌకలు, కనబడకుండా నీటిలో ప్రయాణం చేసే సబుమెరైనులు, బాంబులువేసే విమానాలు దారికాచి స్టీమరులను ముంచేయడానికి ప్రయత్నం చేస్తూవుంటాయి. అందుచే వర్తక నౌకలుగాని, ప్రయాణికుల నౌకలుగాని ఒంటరిగ ప్రయాణంచేయవు. ఒక గుంపుగ బయలుదేరుతాయి. వాటికి కాపలాగా కొన్ని యుద్ధనౌకలు ఫిరంగులతోను, యితర ఆయుధ సామగ్రితోను వెంటవుంటాయి. ఇట్లాంటి సముద్ర ప్రయాణాన్ని "కాన్వాయి" ప్రయాణం అంటారు. సాధారణంగా ఆ ప్రయాణంలో శత్రువుల నౌకలో, విమానాలో, సబుమెరైనులో అడ్డంతగిలి నౌకా యుద్ధం జరుగుతూవుంటుంది. బయలుదేరిన స్టీమరులన్ని క్షేమంగా అనుకున్నతావుకి చేరుకోగలిస్తే మహాభాగ్యం అనుకోవలసినదే. అట్లాంటి ప్రయాణం ఎట్లావుంటుందో తెలుసుకోవాలంటే ఆ ప్రయాణంచేసిన ఒకరు వ్రాసిన యీ విషయం చదవండి:

సరకుగల 15 స్టీమరులు ఉత్తర అమెరికాలో ఒక రేవు నుండి ఇంగ్లాండులో రేవునకు అట్లాంటికు సముద్రంపై ప్రయాణం ప్రారంభించినవి. ఈ 15 స్టీమరులూ వివిధ దేశాల జండాలుగల్గి వివిధ దేశాలవారిచేత నడిపించబడుతున్నాయి. వీటన్నింటికి ఒక వృద్ధనావికుడు పించను ఉద్యోగి నాయకుడుగా ఉన్నాడు. చీకటిలో దీపాలులేకుండా, దగ్గర దగ్గరగా గాలివచ్చినా, మంచుపడినా, దారి కనబడకపోయినా తప్పిపోకుండా ఉండుటకై తగినట్లుగా స్టీమరులను నడిపించాలని అతను ఉత్తరువు చేసెను. ముందుగ ఒక పెద్ద యుద్ధనౌక సాగిపోతుంది. శత్రువుల యుద్ధ నౌకలు ఎదురైతే అది ఫిరంగులు ప్రేల్చి తరిమేస్తుంది. సబుమెరైనులు కనబడినా ముంచే సాధనలు యీ యుద్ధ నౌకయందుంటాయి. తక్కిన వర్తక నౌకలన్నింటిలోగూడ వాటి నవి రక్షించుకోడానికి ఫిరంగు లమర్చబడియుంటాయి. పైనుండి ఎగిరివచ్చు విమానాలను గురిచూచికొట్టే ఫిరంగులు గూడ ఉంటాయి. కాని అవి అన్ని స్టీమరులపై ఉండవు.

ప్రయాణం ప్రారంభంలో సాధారణంగా శత్రువుల నౌకలు ఎదిరించవచ్చును. అవి పెద్ద యుద్ధ నౌకలైనా కావచ్చును లేదా వర్తక నౌకల రూపంలోవుండి ఫిరంగు లెక్కువగా అమర్చబడిన శత్రు నౌకలేనా కావచ్చును. అట్లాంటికు సముద్రమునందు యిప్పటికి రెండు జర్మను యుద్ధ నౌకలు ముంచబడినవి. మరి రైదు బ్రిటిషువారి విమానాల ఫిరంగులచే గాయపడి రేవులలో దాగొన్నవి. వర్తక నౌకల రూపంలోయుండు జర్మను యుద్ధ నౌకలు "కాన్వాయి" గుంపును ఎదిరించినచో తమకే కష్టమని కొంచెం జంకుతాయి. అవి ఒంటరిగానున్న సామాను నౌకలనే ఎదిరించి నష్టపెట్టగలవు. వాటిలో మందుగను లుంచుకొని సముద్ర మార్గాలలో అచ్చటచ్చట పడవేస్తాయి. అవి తగిలితే మన స్టీమరులు చిల్లిపడి మునిగిపోవాలని వారి ఆశ. శత్రువుల విమానాలుగూడ మన స్టీమరులపైన వలయాకారంగా ఎగిరి ఆ ఎగురుతున్నప్పుడు ఒక త్రాడు వురిని వదలి స్టీమరుయొక్క వాయు వార్తాతీగలను, స్థంభాలను చెడగొట్టును. అట్లాచేస్తే ఆ స్టీమరు కష్టకాలంలో బయటకు సహాయం కోరేవార్తను పంపజాలదు. శత్రునావలు రెండు మూడు గొట్టాలు అమర్చుకొని పొగ ఎక్కువగ వదులుతూ వట్టి బొగ్గునావ లనుకోవాలని వేషాలు వేస్తూవుంటాయి. దీపాలులేకుండా తమదేశం జండాలులేకుండా ప్రయాణం చేస్తూవుంటాయి కాని 1914 వ సంవత్సరములో జర్మను వారి ఎమ్డను చేసినంత మోసం, వేషం యింకేస్టీమరు యింత వరకు చేయలేదు.

కాన్వాయిలో స్టీమరులు ఒకటి రెండు పొగమంచులో ప్రయాణం చేయుచున్నపుడు దారి తెలియక వెనుకపడినచో శత్రువుల స్టీమరులకు చిక్కిపోక తప్పదు. కొన్నాళ్లు మంచులో తుపాను గాలిలో ప్రయాణంచేసిన పిమ్మట, సబుమెరైనులుండు తావునకు "కాన్వాయి" స్టీమరులు వస్తాయి. పగలయితే నీటిలో దాగొనియే శత్రువుల సబుమెరైనులు ఒంటరిగా ప్రయాణంచేస్తూ మన స్టీమరులను ముంచాలని చూస్తాయి. రాత్రయితే పైకి తేలుచు కలిసికట్టుగా అతి వడిగా ప్రయాణం చేస్తూవుంటాయి. పైన ఎగురుచుండు శత్రు విమానాలు, వాటికి మన స్టీమరులు ఎక్కడున్నది, గుర్తులు చెపుతూవుంటాయి. ఇవన్ని ఎచటున్నాయో, సముద్రంలో ఏ ప్రాంతం ఎపుడు ప్రమాదకరమయిందో ప్రయాణం చేస్తున్న స్టీమరులకు ఇంగ్లాండునుండే వార్తలు వస్తూవుంటాయి. సాయంకాలం మేఘాలతో చీకటి మరీవడిగా వస్తుంది. సముద్రం శాంతంగానే వుంటుంది. కాన్వాయిలో వెనుకబడుతూవున్న స్టీమరులను, గొర్రెలను మంద కుక్కలు తరిమేటట్లు తరుముకుంటూ యుద్ధనౌకలు ప్రక్కప్రక్కన వస్తూవుంటాయి. ఫిరంగులవద్ద మనుష్యులు సిద్ధంగా వుంటారు. మార్గం కనిపెట్టి దూర్భిణీలతో చూచేవారు అతిశ్రద్ధగ వుంటారు. దూరాన ఆకాశంలో ఒక మచ్చ కనబడుతుంది. ఒక విమానం మేఘంలోనుండి వస్తూవుంటుంది. ఫిరంగి మూతులు దానివైపు త్రిప్పి దాని గమనాన్ని అనుసరిస్తూనే వుంటారు. ఆ విమానం శత్రులదా మిత్రులదా యని అందరం అనుమానిస్తూ వుంటాం. ఒక్క నిముసంలో అది మాయమవుతుంది. అది శత్రువులదా, మేమున్నచోటు దిక్కు, సబుమెరైనులకు తెలపడానికే వచ్చిందా? తెలిపేసిందేమో? అన్న భయంతో వుంటాం.

## నరక ప్రారంభం.

ఒక గంట గడుస్తుంది. చంద్రోదయం అవుతుంది. మా స్టీమరుల దారికెదురుగనున్న నీరు తెల్లగ మెరుస్తువుంటుంది. వెనకాతల శత్రునౌకలే వెంటాడుతూవుంటే, చెంద్రుని కెదురుగా పోవు స్టీమరులు వాటికి స్పష్టంగా తెరమీద నీడల్లాగ కనబడతాయి. అది మరీ ప్రమాదం. స్టీమరు ఇంజనుల చప్పుడు, కెరటాలహొరారు తప్పితే అంతా నిశ్శబ్దంగా వుంటుంది. అకస్మాత్తుగ ఫిరంగులు డాం, డాం అని ప్రేలుతాయి. నరకం మొదలయిందన్నమాట. ఒక చమురు నౌకనుండి మంటలు లేస్తాయి. దానిని టార్పెడో (అంటే, సబుమెరైనులోనుండి గురిచూచి కొట్టబడే పెద్ద తోటా ఫిరంగి) కొట్టింది. దానిచెంతనున్న రెండో స్టీమరుకికూడా మంటలందుకుంటాయి. చుట్టు మంటల వెలుతురు. దూరాన నీటిలో ఎనుబోతులాగ పోతున్న ఏదో నల్లనిదానిపై మా యుద్ధ నౌకలు గుండ్లు ప్రేలుస్తూ వుంటాయి. అది సబుమెరైను శిఖరమయి యుంటుంది. గుండ్లతో త్రుళ్ళే నీటి తుంపరల మధ్య మా యుద్ధ నౌకలు దాని వెంటాడుతూ కనబడతాయి. మరికొద్ది సమయంలోనే నీటిలోనున్న సబుమెరైను పైబడి దాన్ని చిల్లి పొడిచే మందుగుండు పీపాలు (డెప్త ఛార్జి) ప్రేలుట వినబడుతుంది.

మరునాడుదయమయ్యేసరికి సముద్రయానం సాగుతూనే వుంటుంది, దారిలోనుండు మందు గనులను పైనెగురు బాంబరు విమానలను తప్పించుకుంటూను. చివరకు కాన్వాయిలోనుండు స్టీమరులన్ని వివిధరేవులు చేరేసరికి వాటిలోనుండు ప్రశస్తమగు సరకు దింపడానికి వచ్చినవారందరికి అట్లాంటికు ప్రయాణమంటే యేమిటో, అట్లాంటికు యుద్ధంఅంటే యేమిటో తెలుస్తుంది. అదివరకే యిట్టి కష్టాలుపడిన నావికులు ఖైదీలగు జర్మనులు కొందరు ఆ రేవులలో కనబడతారు.

ఈ స్టీమరులలో దిగే నావికులు ఆ రేవు నగరాలలో పోయి చూచేసరికి అక్కడ ఫ్యాక్టరీలన్ని అతి చురుకుగా పనిచేస్తూ వుంటాయి. రేవులలో ప్రజలుకూడా యీ నావికులు ప్రాణాలకు తెగించి తెచ్చే సరకు వృధా చేయకుండా వుండాలని ఆ సరకును అతి లోభత్వంగా వాడుకుంటూ వుంటారు.

ప్రయాణంచేసే మన నౌకలపై శత్రువులు కొట్టడం పైన తెలుపబడింది. శత్రువులకు మనం ఎంతనష్టం కలుగచేస్తున్నామో చూడండి. గత నెలలో శత్రువుల స్టీమరులు 86 మన విమానాలు సబుమెరైనులచే ముంచబడ్డాయి. సముద్రాలలో వారి స్టీమరులకన్న మనవే చాల ఎక్కువవుంటాయి. వారి స్టీమరుల సంఖ్య చాల వడిగా తగ్గిపోతున్నది. మనవి మహాసముద్రాలమీద చాల ధైర్యంగా ప్రయాణం చేయగలుగుతున్నాయి. వాళ్లవి తీరాన్నసుసరించుకొనే పోతూవుంటాయి.

# బ్రిటిషు రాజ కుటుంబం.



6 వ జార్జి రాజుగారు, వారి భార్య ఎలిజబెతు రాణీ, కుమార్తెలు ఎలిజబెతు, మార్గరేటుగార్లు వారి పెంపుడు కుక్కలతో ఆడుకుంటున్నారు.

---

# ఈ వారంలో యుద్ధ వార్తలు.

## జర్మనీపై విమానదాడులు.

వాతావరణం అనుకూలంగా లేకపోవటంవల్ల, ఈ వారంలో రెండు మూడు రోజులు బ్రిటిషు విమానాలు జర్మనీమీద, పెద్ద విమానదాడులు సాగించడానికి వీలులేక పోయింది. కాని మిగిలిన రోజులలో జరిపిన దాడులలో జర్మనీకి గల్గించిన నష్టం, అపారం. 29 వ తేది రాత్రి, జర్మనుల ఆక్రమణలోవున్న నార్వేలో చాలరేవులమీద, పట్టణాలమీద దాడులు జరిపినవి. అందులో ఆలెసండు అనే రేవుమీద మరీ తీవ్రంగా జరిపాయి. జర్మనులు, రష్యాలో ఉత్తర రంగానికి ఈ పట్నంమీదుగానే సైన్యాలను సప్లయిలను చేర్చు కుంటున్నారు. 29 వ తేది రాత్రి దాడిలో ఈ రేవు చాల భాగం శిథిలంచేయబడింది. రేవులోవున్న రెండు జర్మను నౌకలు ముంచివేయబడ్డాయి.

ఆ రోజుననే, ఫ్రాన్సులో ఉత్తరభాగంమీద దాడి సాగిస్తున్న బ్రిటిషు వైమానికులకు ఒక అపూర్వమైన మార్పు కనిపించింది. బ్రిటిషు విమానాలు ఆ ప్రాంతంపైకి రావడంతోనే నాంటిస్ రేవు పట్నంలోని ప్రజలు, బ్లాక్ అవుట్ నిబంధనలకు విరుద్ధంగా, ఎలెక్ట్రిక్ దీపాలను వెలిగించి బ్రిటిషు విమానాలకు స్వాగతమిచ్చారు—ఒక వృద్ధ స్త్రీ ఆనంద సూచకంగా చేతులు విసరిందికూడాను. ఎవరో కొందరు యువకులు అక్కడ ఒక జర్మను సైనికాధికారిని హత్యచేసెనను కారణంచేత జర్మనులు 50 మంది ప్రజలను తుపాకిగుండ్లు బారుచేసి చంపివేసియున్నారు. ఆఘాతుక చర్యచే ప్రజలలో వ్యాపించిన ఆగ్రహావేశంచేతనే, ఆ ప్రాంతపు ప్రజలంతా, బ్రిటిషు విమానాలు రావడంతోనే అంత విరగబడి ఉత్సాహం కనబరచారు.

## 20 జర్మను నౌకలను ముంచివేశారు.

గత 31 వ తేది రాత్రి జర్మనీలోని హాంబర్గు రేవు పట్నంలోని నౌకా నిర్మాణశాలలపైనను, బ్రెమెన్ అనే పెద్ద పారిశ్రామిక పట్నంమీదను బ్రిటిషు విమానాలు వేలకొలది బాంబులు వర్షించాయి. వీనివలన, లేచిన మంటలచూస్తే—ఫాక్టరీలు, నౌకా నిర్మాణశాలలు చాల భాగం పూర్తిగా తగులబడి ధ్వంసమైపోయివుండును. కొన్ని కోట్ల విలువ గల ఆస్తి పరశురామ ప్రీతియైవుంటుంది.

2 వ తేదినగూడ ఆవిధంగా దాడులు సాగిస్తుంటే చాల జర్మను నౌకలు, నిండుగ సరకులతో, యిరోపా ఖండపు కోస్తాను అంటిపెట్టుకుని ప్రయాణం చేస్తుండగా బ్రిటిషు విమానాలకు కనిపించాయి. వానివెంట కొన్ని యుద్ధనౌకలుకూడా కాపలావున్నాయి. అయినా లక్ష్యపెట్టక బ్రిటిషు విమానాలు వానిని ముట్టడించి వందలకొలది బాంబులు వర్షించాయి. అవి తగిలి కొలది నిముషాలలోనే 20 జర్మను నౌకలు మునిగి పోయినవి. మరి 10 నౌకలు చాల దెబ్బలు తగిలి శిథిలమైపోయినవి.

## బ్రిటనుపై దాడులు.

జర్మను విమానాలు యథాపూర్వంగానే, బ్రిటను మీదికి, రాత్రి పూటలలో చాల స్వల్పసంఖ్యలలోవచ్చి అక్కడక్కడ బాంబులువేసి పోతున్నాయి. కాని ఒక్కరోజున గూడ, చెప్పదగినంత పెద్దదాడి జరుగలేదు. విశేషం నష్టం గూడా లేదు. 29 వ తేదిన, ఒక్క విమానం మాత్రమే దాడివచ్చింది. 30 వ తేదిరాత్రి ఆంగ్లదేశపు తూర్పు భాగం ఆగ్నేయ భాగంలోను కొన్ని బాంబులు పడ్డాయి. ఆస్తికి కొంత నష్టంకల్గినా జననష్టం ఏమిలేదూ. 1 వ తేదిన శత్రు విమానాలు మామూలుకంటె కొంచెం యెక్కువగానే వచ్చాయి. అక్కడకూడ, అవి బాంబులువేస్తుంటే, వానిలో 6 విమానాలు కొలది నిముషాలలోనే పడగొట్టబడ్డాయి.

## ఇటలీపట్నాలు భస్మమగుట.

ఇటీవలివరకు బ్రిటిషు విమానాలు, ఇటలీమీద విస్తారంగా దాడులు సాగించుటలేదు. కాని ఇపుడు ఇంచుమించు ప్రతి రాత్రి, ఇటలీలోని పట్నాలమీద దాడులు సాగిస్తున్నాయి. ఉత్తర ఆఫ్రికాకు పంపడానికోసం, ఇటలీ దక్షిణప్రాంతపు పట్నాలలో ఇటాలియనులు, చాల సైన్యాలను, ఆయుధ సామగ్రిని కేంద్రీకరించియుంచారు. అందుచే 30 వ తేది రాత్రి బ్రిటీషు విమానాలు ఆ పట్నాలమీద భయంకరమైన దాడులు సాగించాయి. ఆ పట్నాలలో, బాంబుల ప్రేలుడువలన లేచిన మంటలు, నూరుమైళ్లకంటె యెక్కువదూరం కన్పించాయి. వీనిలో ముఖ్యంగా నేపిల్సుపట్నపు రేవుపైన సాగించిన దాడి మరీదారుణంగా వుందని ఇటాలియనులే ఒప్పుకుంటున్నారు. ఆ పట్నపు స్థితి—అక్కడనున్న "వెసూవియస్" అగ్నిపర్వతం ప్రద్దలైనపుడు, ఎటుల భయంకరంగా వుంటుందో, బ్రిటిషు బాంబులచే లేచిన మంటవలనగూడ అంత భీభత్సంగా వుంది. గత 31 వ తేది రాత్రి నేపిల్సు నగరంమీద, వరుసగా ఆరుగంటలసేపు వందల కొలది బ్రిటిషు విమానాలు వేలకొలది బాంబులు వర్షించాయి. ఈ సందర్భంలో, ఇటలీకి సమీపంగా మధ్యధరా సముద్రంమీద ప్రయాణంచేస్తున్న ఒక ఇటాలియను సప్లై నౌక, ఒక యుద్ధనౌకగూడ ముంచివేయబడెను.

మధ్యధరాసముద్రంలో బ్రిటిషు నౌకాకేంద్రములమీద శత్రుదాడులు ఈ వారం చాల తగ్గినవి. 1 వ తేది అలెగ్జాండ్రియా రేవు ప్రాంతము మీదమాత్రం శత్రువిమానాలు దాడివచ్చి కొన్నిబాంబులు వేసినవి. కాని అధికమైన నష్టం మాత్రం ఏమీ కలుగలేదు.

## ఆఫ్రికాలో పోరాటం.

లిబియా—ఈజిప్టు సరిహద్దులలో (ఉత్తర ఆఫ్రికా) ఉభయపక్షముల సైనికులకు, స్థానికమగు సంఘర్షణలు జరుగుచున్నవిగాని, పెద్ద పోరాట మేదీ ఇంకను ప్రారంభంకాలేదు. బ్రిటనులో కొందరు ప్రముఖులు, ఈజిప్టునుండి లిబియాపైకి బ్రిటిషు సైన్యములు వెంటనే దాడిసాగించి ఉత్తర ఆఫ్రికానుండి ఇటలీ—జర్మను సైన్యాలను పూర్తిగా వెడలగొట్టవలెనని బ్రిటిషు ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నారు. లిబియా టొబ్రూకుదుర్గంలోని బ్రిటిషు సామ్రాజ సైన్యాలు ముట్టడించియున్న ఇటలీ—జర్మనుసైనికదళములపై, రాత్రివేళల చిన్న చిన్న దాడుల సాగిస్తున్నవి. 1 వ తేదిన జర్మనులు, టొబ్రూకు దుర్గపు పడమటిభాగంమీద ఫిరంగిగుండ్లను కొంచెం జోరుగా వర్షించడానికి ప్రారంభించారు. కాని, దానివలన దుర్గానికి ఎక్కువ నష్టమేమీ కలుగలేదు.

## టర్కీ భయాలు—సంసిద్ధత.

రష్యా దక్షిణభాగంలో యుద్ధపరిస్థితుల విషయమై, శత్రులు కాకేసియాను సమీపిస్తున్నకొలదీ, టర్కీదేశపు నాయకులకు—తమదేశపు భవిష్యత్తునుగురించి అలజడికల్గుతున్నది. టర్కీ అధ్యక్షుడగు ఇనుగారు గత 29 వ తేదిన టర్కీ ప్రజాస్వామ్యపు 18 వ వార్షికోత్సవముల సందర్భమున రేడియోలో ప్రసంగిస్తూ, టర్కీకి అపాయం ఇంకా దాటిపోలేదనీ, టర్కీప్రజలు దేశరక్షణకొరకు సిద్ధమై చాల జాగ్రత్తగ నుండవలెననీ హెచ్చరించారు. 1 వ తేదీన టర్కీ శాసనసభయం దుపన్యసిస్తూ "ప్రస్తుత యుద్ధరాజ్యాలకు టర్కీమూలంగా సమాధానం కుదిరి శాంతిని సాధింపగల్గు అవకాశముంటే—అంతకంటె తనకు సంతోషకరమగు విషయముండదని అన్నారు. కాని ఆ వుపన్యాసంలోనే—యుద్ధం కొలది రోజులలోనే ఇతర దేశాలకుగూడ వ్యాపింపవచ్చుననీ టర్కీ యొక్క స్వాతంత్ర్యమును యెవరైన భంగపరచునెడల, టర్కీ వెంటనే ప్రతిఘటించి తన శక్తినంతను ఉపయోగించి స్వాతంత్ర్యమును కాపాడుకొనుననీ హెచ్చరించారు.

## బ్రిటనుకు-ఇరాక్ సహాయం.

ఇరాక్ దేశపు పరిపాలనకర్త ఈ నెల 1 వ తేదిన శాసనసభకు ప్రారంభోత్సవ మొనర్చుచు, జర్మను, ఇటలీ కుట్రలనుండి తమ దేశమును కాపాడినందుకు బ్రిటిషు ప్రభుత్వానికి కృతజ్ఞతను తెలియజేసెను. బ్రిటను యెడల ఇరాక్ దేశం ఎపుడును అత్యంత స్నేహ భావంతోనే వుండుననీ, శత్రుదాడుల నిరోధించుటకు బ్రిటనుకు సంపూర్ణమగు సహాయము చేయుననీ ప్రకటించెను.

ఇరాక్‌లో సైన్యములను ఆయుధ సామగ్రిని త్వరితంగా చేర్చుటకు రహదారులను, రైలు మార్గములను నిర్మించుట కొరకు బాగ్దాదు-బస్రా ప్రాంతాలలో 10 వేల మంది కార్మికులు రాత్రింబగళ్లు పనిచేస్తున్నారు.

## అమెరికా సంరంభం.

"అమెరికా సంయుక్త రాష్ట్రాలకు,—జర్మనీ ఇటలీలకు పరస్పరం యుద్ధం ఇదివరకే ప్రారంభమైనది. అది సముద్రాలమీద జరుగుచున్నది." అని ఒక అమెరికను శాసన సభ్యుడు అన్నాడు అట్లాగే, ఈ వారం జర్మను జలాంతర్గామి యొకటి, ఐస్లాండు దేశమునకు స్వల్ప దూరంలోనే వర్తక నౌకలకు కాపలాగావున్న "రూబెన్ జేమ్సు" అను అమెరికను డిస్ట్రాయరు (చిన్న తరగతి యుద్ధ నౌక) ను ముంచివేసింది. మరి రెండు రోజుల తరువాత ఒక అమెరికను నూనె నౌకను గూడా ముంచుటకు ప్రయత్నం జరిగింది. ఆ నౌక చాల దెబ్బలు తిని చెడిపోయినా, ఎట్లాగో రేవుకు చేరుకుంది. ముందు అమెరికను యుద్ధ నౌకలే యెదిర్చినవనియు, ఆత్మరక్షణ కోసం తమ జలాంతర్గాములు అమెరికను నౌకను ముంచివేయవలసి వచ్చినదనియు జర్మనులు ఆరోపిస్తున్నారు.

అమెరికను నౌకలను, హెచ్చరికైనా లేకుండా యీ విధంగా ముంచివేయడం, అమెరికా ప్రజలలో రోషం కలిగించింది. దానివలన, తటస్థ శాసనాన్ని సవరించి, అమెరికను వర్తక నౌకలకు కూడా ఆయుధాలు అమర్చవలెనను చట్టమునకు శాసన సభలలో అనుకూలుర సంఖ్య అధికమైనది. ఒక్క సభ్యుడు అడ్డు తగలటంవలన ఆగిందిగాని, లేకపోతే, ఆ చట్టం 2, 3 తేదిలలో ఒక శాసన సభవారి ఆమోదం పొందియుండేది.

రష్యాకు, బ్రిటనుకు ఆయుధముల సప్లైలు ఇటీవల చాల హెచ్చినవి. అమెరికా ప్రభుత్వం తమకు కావలసిన వానిని గూడ తగ్గించుకొని ఆయుధ సామగ్రిని రష్యాకు పంపిస్తున్నారు. రష్యాకు ఈ ఆయుధాలు మందుగుండు త్వరితంగా అందుట కోసం, అమెరికానుండి అట్లాంటిక్ సముద్రపు ఉత్తర భాగంమీదుగా, రష్యనుల ఆర్చేంజలు రేవునకు పంపుతున్నారు. శీతకాలంలో ఆర్చేంజలు రేవులో నీరు గడ్డకట్టి పోకుండావుంచుటకు యేర్పాటులు జరుగుతున్నాయి.

ఆయుధ నిర్మాణంలో, సమ్మెలవలన, ఆలస్యం జరుగకుండ జేయుట కోసం యజమానులు, పనివారు కలసి రాజీ నేర్పరుచుకొనని ఫ్యాక్టరీలను ప్రభుత్వ సైనిక శాఖవారు స్వాధీనం చేసుకొని నడిపిస్తున్నారు. కార్మిక సమ్మెలను ప్రోత్సహించుట, కుమ్మకు చేయుట దేశద్రోహమగు నేరముగ ప్రకటిస్తూ, శాసన సభలో, సభ్యులలో ఒకరు చట్టమును ప్రతిపాదించారు. ఈ విధంగా ఫ్యాక్టరీలన్నిటిచేత పూర్తిగా పనిచేయించి, వచ్చే సంవత్సరంనుంచి సాలీనా లక్ష విమానాలను తయారుచేయుటకు, అమెరికనులు సంకల్పించుకున్నారు.

రష్యాకు ఆయుధ సహాయం చేయుటయేకాక, ఫిన్లండుకు—రష్యాకు యుద్ధం విరమింపచేయడానికి అమెరికా ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. అందుకుగాను, ఫిన్లండును వెంటనే యుద్ధమునుండి విరమించుకొనవలెననీ, ఫిన్లండుకు చాల అనుకూలమగు షరతులతో—సంధి కుదిర్చిపెట్టెదమనీ, అందుకు అంగీకరింపనిచో, ఫిన్లండుకు, అమెరికాకుగల స్నేహ సంబంధములు చెడిపోవునని హెచ్చరించింది.

## రష్యా యుద్ధం.

రష్యా యుద్ధరంగాలలో ఈ వారం యెక్కువ మార్పులు లేవు. ఉత్తరపు చివర—మర్మనిస్కు రేవు పట్టణమును పట్టుకొనుటకు జర్మనులు ఫిన్నులుకలసి పెద్ద దాడులు సాగించిరి. కాని, వానినన్నిటిని రష్యనులు తిరుగగొట్టివేశారు. మర్మనిస్కునకు 14 మైళ్లకులోపల, శత్రువులెక్కడను సమీపింపగలుగలేదు. లెనిన్‌గ్రాడు నగరమును ముట్టడించియున్న జర్మనులపైన, రష్యను సైన్యము ఈవారం చాల తిరుగుదాడులు సాగించి వెనుకకు కొట్టివేసినవి.

రష్యా రాజధానియగు మాస్కో నగరమును పట్టుకొనుటకు, జర్మనులు నాల్గు వైపులనుండి సాగిస్తున్న దాడులు, ఏమాత్రం ఫలవంతం కాలేదు. ఉత్తరమునుంచి వస్తున్న సైన్యాలు 20 రోజులనుండి—మాస్కోకు 100 మైళ్ల దూరమునందున్న కాలినిన్ నగరమునుదాటి రాగలుగలేదు. వాయవ్య దిశను, పడమటి దిశను శత్రువులు ఏమాత్రం ముందుకు రాలేదు. దక్షిణమునమాత్రం 150 మైళ్ల దూరమున వున్న ఓరెలు అనే పట్నమునుంచి 100 మైళ్లసమీపంలో వున్న "టులా" నగరమువరకు త్రోసుకు రాగల్గిరి. కాని రష్యను సైన్యములు శత్రుల నచటనే నిలిపివేసెను.

దక్షిణమున డానెట్సు నదీ ప్రాంతంలోమాత్రం, శత్రులు కొంత ముందుకు రాగలిగిరి. కాని, రష్యను సైన్యములు కొత్త సేనానినాయకత్వం క్రింద జర్మనులను నిలువరించినవి. ఆ ప్రాంతంలో శత్రులు పూర్తిగా వెనుకకుతిరిగి పారిపోవుచున్నారు. హతులైన వేలకొలది తమ సైనికులను ఆయుధ సామగ్రినీ యుద్ధరంగంలోనే వదలిపోవుచున్నారని రష్యా అధికారులు దెలుపుచుండిరి.

దక్షిణకొనను, క్రిమియా ద్వీపకల్పంలో జర్మనులు చాలవరకు ముందుకు తోసుకొనివచ్చి, రాజధానియగు సిమర్‌పూన్ నగరమును ఆక్రమించితిమనీ, క్రిమియాలోని రష్యను సైన్యముల రెండుగా చీల్చివేసితిమనీ జర్మనులు ప్రకటించుకున్నారు. అది పూర్తిగా నిజం కాకపోయినా, క్రిమియాలో పరిస్థితులు ప్రమాదకరంగానే వున్నవని రష్యనులు గూడా అంగీకరిస్తున్నారు. క్రిమియాకొరకు జరుగుచున్న పోరాటంలో మొదటి 12 రోజులలోనూ 90 వేల సుశిక్షితమగు జర్మను సైన్యం హతమైనది.

## బ్రిటిషు నౌకాబలం.

రెండు యేండ్ల సంగ్రామమున, చాల నౌకలను బ్రిటిషు ప్రభుత్వము ఇంతవరకు కోల్పోయినను, నేటికి బ్రిటనుకు 250 లక్షల టన్నుల పరిమాణముగల నౌకలు గలవని అమెరికా సెనేటు సభ్యులలో ఒకరు ప్రకటించిరి. యుద్ధారంభమున బ్రిటనుకు 210 లక్షల టన్నుల నౌకలుమాత్రమే గలవు.

రష్యాపై జర్మనుదాడి ప్రారంభమైన పిదప, జర్మనులు బ్రిటిషు నౌకలపై జలాంతర్గాముల దాడిని హెచ్చించిరనియు, కాని బ్రిటిషు నౌకాదళచర్యవలన నష్టములు చాల తక్కువలో వుంచబడెననియు, నౌకామంత్రి అలెగ్జాండరుగారు ప్రకటించిరి. గత 29 వ తేదీన రెండు బ్రిటిషు నౌకలు స్పెయిను రేవునుండి బయలుదేరి కొలదిదూరము సముద్రమును ప్రవేశించిన తోడనే ఆకస్మికముగ జర్మను విమానములు వానిని యెదిర్చెను. వానిలో ఒక నౌక మునిగిపోయెను.

## విషీ ప్రభుత్వం.

విషీ (ఫ్రెంచి) ప్రభుత్వ మంత్రివర్గము 30 వ తేదీన సమావేశమై, జర్మను అధికారులపై జరుగుచున్న హత్యల గురించియు, వాని నివారణోపాయముల గురించియు, హత్యలకు ప్రతీకారముగ జర్మనులు అమలు జరుపుచున్న మరణ దండనల గురించియు జరుగుచున్న రాయబారములను, డార్లన్‌గారు మంత్రివర్గమునకు విన్నవించిరి. జర్మనులచే చంపబడిన ఫ్రెంచి వీరుల సంస్మరణమును 31 వ తేదీన మిత్రమండలి సైనికులు నావికులు అన్ని ప్రాంతములలోను జరిపిరి.

దక్షిణాఫ్రికా సముద్ర ప్రాంతముమీదుగ ఫ్రాన్సునకు ఆహారపదార్థముల దెచ్చుచున్న ఫ్రెంచి నౌకలను, బ్రిటిషు ప్రభుత్వ నౌకలు ఆటంకపరచి సదరు నౌకలను తమరేవునకు పట్టించుకొనిపోయినందుకు విషీ ప్రభుత్వము బ్రిటిషు ప్రభుత్వమునకు తీవ్రమగు అసమ్మతిని దెలిపెను.

బ్రిటిషు రేడియోవార్తలనుగాని, మరికొన్ని ఇతరదేశముల రేడియో వార్తలనుగాని వినినయెడల ప్రజలకు తీవ్రమగు శిక్షల విధింపబడునని విషీ ప్రభుత్వమువారొక చట్టమును ప్రకటించిరి.

## జపాను.

తూర్పు ఆసియా ప్రాంతములలో అపాయం ఈవారము గూడ తగ్గలేదు. అమెరికా-సంయుక్త రాష్ట్రాలకు జపానుకు వివాదములు పరిష్కారము కాలేదు. ఈ విషయమై ప్రశ్నలకు జపాను అధికారులు, సమాధానమిస్తూ "ఉభయ దేశాలకు మధ్య రాయబారములు ఇంకా వదలుకోలేదు" అని అన్నారు. జపాను ప్రధానమంత్రియైన టోజో సేనాని, "ఇంత క్లిష్ట స్థితులు జపాను చరిత్రలో యెప్పుడు సంభవించియుండలేద"న్నాడు. దేశములోని ప్రధానమగు పరిశ్రమలనన్నిటిని, ప్రభుత్వాధికారుల సలహా ప్రకారం పని చేస్తుండవలెనని ఉత్తరువు చేశారు. దేశమున యుద్ధ పరిస్థితుల అమలుకు రావలసిన యేర్పాటుల నన్నిటిని ప్రారంభించిరి. భారతదేశమునుండి అమెరికా మొదలగు ఇతర దేశములనుండి జపానీయులను స్వదేశానికి చేర్చుకొనే నౌకలు ప్రయాణికుల నెక్కించుకొని బయలుదేరి వెళ్లిపోయినవి. షాంగుహైలోను, జపాను ఆక్రమణయందున్న చైనాలోనుగల బ్రిటిషు పౌరులను - స్వదేశమునకు మరలి రావలసినదని బ్రిటిషు అధికారులు ఉత్తరువు చేసిరి.

జపాను, ఆస్ట్రేలియా న్యూజిలాండు దేశములపైన దాడి సాగించునని జర్మనులు కొందరు సూచిస్తున్నారు కాని, ఆస్ట్రేలియా ప్రభుత్వ ప్రధానియగు కర్టిన్‌గారు, ఆస్ట్రేలియనులు తమ స్వదేశమును రక్షించుకొనుటకు దృఢ నిశ్చయులైయుండిరని రక్షణ యేర్పాటులన్నీ సిద్ధమొనర్పబడెననీ ప్రకటించాడు. భారత ప్రధాన సేనానియగు సర్ ఆర్చిబాల్డు వేవలుగారు, తూర్పు ఆసియాలోని రక్షణ సన్నాహముల పరీక్షించుటకుగాను సింగపూరు వెళ్లిరి. అక్కడనుండి ఆస్ట్రేలియాకుగూడ వెళ్లి చూచిరానున్నారు.

ఈలోగా, జపాను ప్రస్తుతం ఏ దేశంమీద దాడితీస్తుంది అనే విషయమై తూర్పుదేశాలలో అలజడిగావుంది. ఇండో చైనాలో తాయిదేశం సరిహద్దులలో జపాను అధికారులు సైన్యమును కేంద్రీకరిస్తున్నారనీ, తాయిదేశంమీదకుగాని, బర్మామీదకుగాని అచటి జపాను సైన్యాలు దాడి సాగింప వచ్చునని చైనా అధికారులు కొందరంటున్నారు. జపాను సైన్యాలు సరిహద్దులదాటి, తాయిదేశమును ప్రవేశించెనను మాట అబద్ధమనీ, తాయిసరిహద్దులలో ఇంకా సంఘర్షణలు లేవనియు, అట్టి సంఘర్షణలు రాకుండ చేసుకొనుటకు తమ సైనికులను సరిహద్దులనుండి చాల వెనుకకు మరల్చు కొంటిమని తెలియచేశారు. తాయి ప్రభుత్వం దేశరక్షణ యేర్పాటుల త్వరితంగా పూర్తిచేస్తున్నది. 1942 వ సం॥ జనవరినుండి ప్రారంభమయ్యే సంవత్సరంలో, సైనిక శాఖ వ్యయము 310 లక్షలనుండి 1,100 లక్షలకు హెచ్చింపబడింది.

చైనాలో జరుగుచున్న పోరాటాలలో జపాను సైన్యాలు ఈ వారం చంగ్షియను ప్రాంతమును వదలివేసి వెనుకకు మరలి పోయినవి. రెండు నెలల క్రిందట జపానీయులు ఆక్రమించుకొనిన చంగ్షా అను ముఖ్యమగు రైల్వే జంక్షను పట్టణమును తిరిగి చైనా సైన్యాలు ఆక్రమించుకున్నాయి. జపాను సైన్యములు హూనాన్ అను రాష్ట్రంలో ప్రధానమగు ఖూనాన్ అను పట్టణమును ఆక్రమించితిమని జపానీయులు ప్రకటించుకున్నారు. జపాను సైన్యాలు ఇకమీద ఇండో చైనానుండి బర్మా సరిహద్దులలోనున్న యూనాన్ క్వీజా అను రాష్ట్రములను ఆక్రమించుకొని తద్వారా బర్మా రోడ్డుమీదుగా చైనాకు ఆయుధములు సప్లై కాకుండ అడ్డగింపవలెనని జపాను సైనికాధికారు లుద్దేశించుచుండిరని చైనా అధికారులు ప్రకటించిరి.

జపానుకు సాలీనా 13 లక్షల టన్నుల పెట్రోలును సప్లై చేయుటకు డచ్చి తూర్పు ఇండియాలోని కంపెనీలు ఇది వరకు ఒడంబడిక చేసుకున్నవి. ఆ ఒడంబడిక వాయిదా ఈవారంతో ముగిసిపోయింది. దాని మరికొంత కాలము పొడిగింపవలెనని జపానుగూడ కోరియుండలేదు. అందుచే డచ్చి ఇండియానుండి జపానుకు నూనె సప్లై పూర్తిగా ఆగిపోవును.

## తటస్థ దేశములు.

స్వీడనునందలి యువకులు బ్రిటిషు విమానదళ శాఖయందు ప్రవేశించుటకు స్వీడనులో రహస్య సంఘముల నేర్పరచుకొని పనిచేయుచుండిరి.

స్వీడను ప్రభుత్వము తమ ప్రజలకు సైనిక శిక్షణకాలమును 12 నెలలనుండి 18 నెలలకు హెచ్చించుటకు శాసనసభలో ఒక చట్టమును ప్రతిపాదించెను. అవసరమగుచో ఈ శిక్షణ కాలమును మరి ఆరు నెలల కాలము పొడిగించుటకుగూడ ఈ చట్టమున అధికారమొసగబడెను.

## ఆక్రమిత ప్రాంతాంలో ప్రజల అవస్థలు.

సెలోనికాలో (గ్రీసు) ఎవరో కొందరు ఒక జర్మను సైనికుని హత్యచేసినందుకు ప్రతీకారముగా జర్మను అధికారులు, తాము ఆదివరకే పట్టుకొని-ప్రజల సత్ప్రవర్తన కొరకు హామీగా తమవద్దనుంచుకొనిన పురప్రముఖులలో 13 మందిని ఖురతీసి చంపివేసితిమని ప్రకటించిరి.

ఎవరో జర్మను అధికారులను హత్యచేసినందుకుగాను నిరపరాధులగు ప్రజలను చంపుట రాక్షస కృత్యమని ఖండించుచు కోస్టారికా, అర్జెంటైనా ప్రభుత్వములు. (రెండును దక్షిణ అమెరికా దేశములే) జర్మను ప్రభుత్వమునకు ఆక్షేపణను తెలియజేసెను.

యుగోస్లావియాలో ఒక్క జర్మను సైనికుని ఎవరో హత్య చేసినందుకుగాను ప్రతీకారముగ జర్మను అధికారులు తమవద్ద నిర్బంధమునం దుంచబడిన యుగోస్లావు కమ్యూనిస్టులలో 50 మందిని చంపివేసిరి.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.